# రాధాధవ శతకము



కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి
ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

మూల్యము ౨ అణాలు

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి. ౧౯౩౯

ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి
కూచిపూడి
(తెనాలి తాలూకా)

# అభ్యర్థన

కం. శిష్టేష్టతనూజకలా
హృష్టము లమలరసపుష్టిమృష్టములు యశో
జుష్టము లనుపమవిభవవి
శిష్టము లలరుత ధరిత్రి శిష్టాన్వయముల్.

శా. శ్రీసంధ్యాప్రథమానసద్గుణకనత్సీమంతినీమూర్ధభా, నూన
ప్రాభవ సోమమాంబ యన్సుగుణం దోడై సుఖ విఖ్యాయ
ల, శ్రీమన్నారాయణసేవ్యమాన పదరాజీవద్వయుండై
యశః, శ్రీ నింపొప్పిన శాయనాఖ్యసుధి యర్థిన్
మాకు సంస్మార్యుండౌ.

సీ. త్రివిధఫలప్రద త్రిపురమాలిని యోమ
హోమహూనకు నిరతార్చ్యచరణ,
నిగమగోచరకలానిరుపమ గాయత్రి
స్థిరయశుఁ డేవాని జేబుడబ్బు,
ధరణిజాధవుండు కోదండరామవిభుండు
స్తుత్యుఁ డేఘనునకుఁ దోడునీడ,
తత్త్వమయానిలాత్మజ పరబ్రహ్మమ్మ
పేర్పుకూర్మి నెవాని కూర్చు ప్రాపు,

పలుకుబడిదారు లితర దైవతవిశేష
ములు బలమ్ములతోడ నేపుణ్యమతికి,
నాప్రథితలంకపల్లగ్రహారవాస
రతుండు శాయనశాస్త్రి విస్తృతగుణుండు.

గీ. భవ్య మాత్మనామాంచితప్రథిత మీశ
తకముర కమున రాధికాధవుండు తనరు
దయం దదన్వయ మాచంద్రతారకముగ
నవయశస్స్ఫూర్తి మెఱయ నొనర్చుంగాత.

గీ. తన్మతనూజామృదుమనశ్శిఖావళాభి
నవఘనము రామవిభుకరుణారసార్ద్ర
దృష్టినాసుధావృష్టి నభీష్టపూర్తి
బీజతతి మోసులెత్తి శోభిల్లుంగాత.

కొల్లూరు,
౨౮-౬-౩౮.

ప్రభాకరశాస్త్రి
(జామాతృండు)

ఓం

# రాధాధవ శతకము

---

మ. కలధౌతాంబర, శంబరప్రభవభూకాంతాత్యయనీనాథను,
త్యు, లసత్కాలవలాహనీలతను, శుక్లాపాంగపింఛావతం
స, లతాంతాస్త్రసహస్రసుందర, మునీశస్తోమభూమా
ర్చనా,కలనాగమ్య, యగమ్య, రమ్యతరపత్కంజాత,
రాధాధవా!

మ. గడియించెన్ రచియించి మించి మును సంఖ్యావత్ప్ర
కాండౌఘ మెక్కుడుగా లెక్కకు హృద్యముల్ శతక
ముల్ కుంఠమ్మకానట్టి పే, రుతుంగంబౌని యశమ్ము; నీతి
గతి భక్త్యుద్రేకముల్ సర్వముం, గడముట్టం బ్రకటించి
యవ్వి యలరంగా నోపు రాధాధవా!

మ. అటు తద్వర్ణితమైనకారణముచే నాపీతసారాన్వితం,
బటు రాజిల్లెడి నిప్పు సర్వ; మవుచో నాచాయ, నింకన్
మఱొక్కటి కూర్పం బనియే హుళిక్కి; యయినం
గాంక్షింతు నిర్మింప; నెచ్చట నేనిన్ విలసిల్లుచో
గొనఁగదే సారంబు రాధాధవా!

మ. కనరా దేయెడ నీదుపాదయుగకైంకర్యంబ కన్దోయికిన్;
వినరా దేయెడ వీనులన్ విమలమా నీనామగానంబు;
పేర్కొనరా దేయెడ నీమహామహిమ నేరున్ నేర్పు;
పాఖండదుర్జనసంకీర్ణమరై ధరాతలము భ్రష్టంబయ్యె
రాధాధవా!

మ. అమల, మ్నాయత, మాజవంజనదవాగ్భాగ్యసార,
సజ్జత్స్వర్ధమనష్కర్ధమతిగ్మరశ్మిరుచి, యుద్ధామాఘ
మేఘాశుగంబు, మహామానివరాన్వహార్థ్యము, సురే
ట్పూజ్యంబు, నీపాదపద్మ మదె ప్రార్థని మాదుతాప
సమితిన్ మాయించు రాధాధవా!

మ. హారి నాశామృగతృష్ణఁ దృష్ణఁ జని యేపుంజూపు
తాపంబునన్, స్మరదుర్దాంతకిరాతమార్గణహతిన్ సంసా
రమన్ ఘోరమా, మరుభూమిం బడి స్రుగ్గి మ్రగ్గి
చెడ నౌ మర్త్యగణసంఘంబు నీకరుణంగాదె విపత్తులెల్లఁ
గడువంగాఁబోక రాధాధవా!

మ. జలజాతాక్షులచూపుతూపుగమిచే సంవిద్ధమై తద్ద
చిల్లులు ప్రావన్ నిజధైర్యకంచుకము గోల్పున్ గుడ్వఁగా
నౌచు నిచ్చలు నవ్వారిపదార్చనాభిరతి నష్టభ్రష్టులై
కూలు మర్త్యులకుం దారక మెన్న నీకుభజన
మ్మొక్కండె రాధాధవా!

మ. కశలన్ మోదుచు భీమపాశవితతిన్ గాల్సేతులం బట్టి క,ట్టి శిర మ్మట్టె విభిన్నమై చెదరునట్లే కొట్టుచుం దిట్టుచుం, బశుజీవంబుల నీడ్చికొంచుఁ జనున ప్పాశ్యు ద్భటశ్రేణిఁ ద్వ,ద్వశగస్వాంతుఁ డావేళ నేనిఁ దిలకింపం బోఁడు రాధాధవా!

మ. పరఁగన్ వారణమైన, మీనువయినన్, వారాహమైనన్, నృకేసరివైనం, గమఠంబవైన, వసుధిస్ఫారోర్మ్యులన్ డాగినం దరుణీయుక్తుఁడవై త్యజింప, నిను మత్స్వాంతోరువార్యర్గళం, బరువుం జూడక భక్తిరజ్జువులచే బంధింతు రాధాధవా!

మ. అతిపారంబు భవంబుపేరిటి మహోగ్రాంభోనిధిన్ మున్సన్, సతిపేరింటిది గ్రాహమొక్కఁడిదె కిన్కం బట్టెఁ బాదంబులన్, గతమయ్యెన్ జవమున్ సమస్తము, నిఁకన్ గావింపుము మత్సము,ద్ధృతి మాతంగసమర్చ్య! కూర్మిమెయి నార్తిం బాపి రాధాధవా!

మ. సుర సిద్ధోరగసాధ్య మానివర రక్షోభూతయక్షాప్సరోనరవిద్యాధర కిన్నరాదినుతమున్, దంభోళిచక్రాంకసుం,దరమున్, గిల్బిషపంకశోషణము, నిర్ణాశాఽవ నర్గప్రదం, బరుణాబ్జాతనిభంబు, నీపదయుగం బర్చింతు రాధాధవా!

శా. రాగద్వేషము లందనీక, సుజనవ్రాతంబులం దూరఁ
బోఁ,గాఁ గోర్కెం గననీక, యన్యధనముం గాంక్షిం
పఁగానీక, దు,ర్భోగాసక్తి జనింపనీక, ఖలులం భూషిం
పఁగానీక, యో,నాగాధీశఫణాశయాన, సతమున్ నన్
బ్రోవు రాధామాధవా!

శా. ప్రాణంబుల్ భరియింప నీచజనులం బ్రార్థింపఁగాఁ
బోను, నా,పాణుల్ జాపను దేహియంచు నెప్పుడుం
బాహుండులం డాసి, యేఁ బ్రాణంబుల్ మెయిఁ బాయ
కుండుదనుకన్ బ్రార్థింతు నిన్నే మదిన్, మాణిక్యాం
చితహార! యియ్యదియ నామార్గంబు రాధామాధవా!

శా. దారాపత్యరతుల్, త్వదీయచరణధ్యానప్రభావర్జితుల్,
మారానేకవశంగతుల్, ఖలమతుల్, మాత్సర్యసంవేష్టి
తుల్, సారాచారవిచారదూరులు నరుల్ సంసార
దుష్పారపా,థోరాశిం దరియింపఁబోక దెస యెంతో
కాంత్రు రాధామాధవా!

శా. కాయంబందున సత్వముండుదనుకం, గర్మిష్ఠు
డున్నప్పు, డా,దాయం బంతయుఁ జేత నున్నతఱి నీ
దారాసుతుల్ జేరి నిన్,బాయఁజాల మటంచు రన్ని
యుఁడుగన్ మాటాడరా రెవ్వరున్, సాయంప్రాతముఁ
గుందుచున్న గొడవన్ సత్యంబు, రాధామాధవా!

శా. ధన్యంబన్యనరాధవమాధములకుం దాస్యంబు గావించి
నం, ధన్యంబాసె మదీయజన్మ భువి? నోదాసౌఘ
మందార! నే, నన్యమ్మెంం డెఱుఁగం భజింతు
భవదీయాంఘ్రిద్వయమ్మెప్పుగా, ధన్యుం జేయవె
నారదాదిమునివంద్యా, నన్ను రాఘాధవా!

మ. తమిమీఱంగ గలనేనియుం నిజమహద్గాధాఖ్యాపీయూ
షసా,రము పాన మ్మొనరింప నేరువని నిర్భాగ్యుం డెనాఁ
డేని భక్తి మదిం నీపదపద్మముల్ దలఁచుచో దీర్ఘాను
కంపారసా,ర్ద్రము దృష్టిం బొసరింతు శాంతభవరుక్తా
పాఘ్న్య రాఘాధవా!

మ. శ్రుతిమార్గమ్ము గంటి, ధర్మగతికిం క్షోభ, మ్మధర్మ
మ్మువ,ద్ధతి కెంతే నెగడుం బొసంగుతఱి నీధాత్రీస్థలిం
ధర్మము,ద్ధృతిఁ గావింపఁగ శిష్టరక్షణపరాధీనమ్ము
చిత్తమ్మునం, ధృతనానాకృతివై జనింతు వెపుడుం
నిక్కంబు రాఘాధవా!

మ. ఇల నేరూపము కాదు నీది; జననం బేజీవులం దొంద;
వె, ష్టలరం నేఁడు; వనాది; వాద్యుఁడవు; మధ్యాంతం
బులుం ద్వత్తిన్నతం,బుల; యారెండును లేనిజాణవు;
సతమ్మెం గూర్చి రక్షింతు వి,మ్ములవెంటం బడఁబోని
ధీరులకు శమ్ముల్ సుమ్ము రాఘాధవా!

మ. నెఱిఁ బాఠీనమవై పవిం గెలువనౌ నెమ్మే న్గఱుల్
గోఱలుఁ, మోఱయుం దిగ్గచుఁ గల్పమంతమున మ
న్నీర్వాధిం, శౌలో, విధిం, బఱచం బొల్పడి ప్రముచ్చి
లించి నిగమవ్రాతంబులం బాఱు నక్కఱటుఁ సోమకుఁ
ద్రుంపవే నిగమోరతౌడీశ రాధాధవా !

మ. మును దుంధానము మందరమ్ము సురగమ్ముం ద్రాఁడు
గావించి ద్రచ్చునెడఁ వేల్పులు రక్కసుల్ సుధకు,
నచ్చో వార్ధి భూధ్రంబు పీర్చి సంక్షుబ్ధత బ్రుంగ దాని
భవదుర్వైద్యంబు కూర్మాకృతిం, దసరం దాలిచి
మోచి మించవె సురేంద్రస్తుత్యా, రాధాధవా!

మ. ప్రలయాంభోధిగభీరనీరమున భారంబై కపుం బ్రుంగు
బ్రాఁ,బలుకుల్ పెట్టియు తాత కూర్చిన మహాద్బ్రహ్మాండ
భాండంబు వేల్పులమూఁకఁ వెఱపించు కోఱపగ
మోపుం జూపఁ గ్రోడంబవై, యలరం బేర్మి సముద్ధ
రించితి హిరణ్యాక్షారి, రాధాధవా !

మ. మునిసర్గంబునకుం గడంగి, స్వతపోభూరిప్రభావంబునం,
గొని దేవస్తుత, సాధుపోషణరతిఁ గూఢంబునై కర్మ
జరు,ధనముల్ చే సడలించి మోక్ష మిడు విజ్ఞానంబు
బోధించి మిం,చిన వేదాంతవనస్థలీహరివి వాసిఁ నీవు
రాధాధవా !

మ. అలరన్ ధర్మకళాధినర్గమున నుద్యద్వృత్తిమై శాంతి
దాంతులు నీరాగము మున్నుగాఁ గలుగు సన్న్యాస
మ్ములో సద్గుణమ్ములు మానీంద్రయుగాకృతిన్ మివుల
బాల్యం గాంచి కావించితిమ్ముల నుగ్రమ్ము సుమహా
రమ్ము తపమున్ మునిన్నీవు రాధాధవా!

మ. అనసూయా స్తనపాయివై తొలుత దత్తాత్రేయనామం
బునం, దనయత్వంబునం గ్రాలి యత్రిముని కాత్మజ్ఞాన
సారం, బలర్కనరాధీశసురారిపుత్త్రులకు వక్కాణించి
యుక్కార్పవే, ఘన మజ్ఞానతమమ్ము బోధరుచి లోక
మ్మంద రాధాధవా!

మ. వలిగుబ్బల్, నునుపోయగంపుకను, లభ్రాంతమున్
మించువేనలి, తీరైన మొగంబు, ముద్దుమాట, నందం
బొప్పు కేల్దోయి, నిస్తులరమ్యోరుయుగంబు నొప్ప
భవునిం జోద్యంబుగా మోహాసింధ్వాఘూర్మిన్ మునిం
గించి పర్విడిన మాయారామ, రాధాధవా!

మ. అవతారంబులు దాల్చితీవు శతసంఖ్యాకంబు లన్వా
గ్మనస్యవికారంబులు నేకరూపము; లోక ప్రశస్తమ్ముగ్రీవ
మ్మునన్, గవినుత్యమ్ము మృగేంద్రమానసమునం
గైకొంటివై భక్తతత్త్వవనాయత్తము చిత్తవృత్తి
హతదైత్యవ్రాత, రాధాధవా!

మ. తిలకింపం ద్రిదశాద్యు లెల్లను విభూతిన్ సామ్యమే
లేనియట్టులు బ్రహ్మాండకటాహమ్ముం బ్రిదిలి బీటుల్
వ్రోవ మై వెంచి, యొక్కలలిన్ బాదయుగంబునన్
భువనసంఘం బాక్రమింపంగనై, బలి శిక్షించితి నెత్తిపె
నిడి వటూ! పాదంబు, రాధాధవా !

మ. అరయంబో కవచారమ్ముం బిత్రుఁ దపస్యానిష్ఠు బ్రహ్మి
ష్ఠుని, బరిమార్పం దొరకొన్న క్రముకక్షులపై స్వాం
తంబునం గిన్సి నిర్జర! నీ విర్వదియొక్కమారు నిహత
క్షాత్రంబు గావింప నుర్వర, నవ్వారిఁ గుఠారధారఁ
బొలియింపవా లేదె రాధాధవా !

మ. తమిఁ బాటచ్చరమానినియై యనుఁగుకాంతం దాంత
కాంతారమధ్యమునన్ ముచ్చిలిగొంచుఁ బాఱిన
దశాస్యాస్యాటవిన్ వైర్యవార్య మనూనం బమరాద్య
భీతిదము శౌర్యాటోప మేపార స్వీయమహాస్త్రాగ్ని
దహింపవే రఘుకులాగ్ర్యా, యీడ్యు, రాధాధవా!

మ. శరదబ్జాహితు గేలిసేసెడు మెయిన్ శ్యామాంబరం
బొప్ప, భాస్వరనీలాభ్రపరీతసానుయుతమా ప్రాలేయ
శైలంబురీతి రహిన్ సేవకతాపముల్ డులిచి ప్రీతిన్
సాఁకవే యాదవప్రోత్కరముఁ స్వాంశవిభిన్నమూర్తి
వయి, భక్తస్తుత్యా, రాధాధవా !

మ. భువి శేషాపరమూర్తి యన్ద్రదు హలిన్ భూరిప్రభా
వాఢ్యుని, భువనోద్ధారచణుం, డనంతుఁడు, యతీ
టూప్పాజ్యుండు, ధర్మావన, ప్రవణుం, డాత్తశతావతా
రుఁడు, సురారాధ్యుంను నవ్వాఁడు నోఁట విభేద
మ్మల నీకు శేషునకుఁ జూడన్ రాదు రాధాధవా!

మ. కలశోదన్వదభంగభంగతతి రేఖాడోలికా కేలికా, కలనం
గల్మలకల్కి తోఁ బొలుమ నాగ ప్రఖ్యతల్పుండ వీ, వల
భక్త ప్రవరావనాభిరతి సందార్ద్రాంగిముంగింట మిం,
చుల మించందగు మేనఁ గూన వయి హాసుం గంటి
రాధాధవా!

మ. పరమాప్తుం డవుకంసరా జలుక నీప్రాణానిలుం గ్రోలు
నిష్ఠురకార్యమ్మున కంప వచ్చిన మహాశూరుల్ తృణా
వర్తముఖ్యరిపుశ్రేష్ఠుల లీలమై గెడపి నీయందే తమిం
జేర్చికొంటి రమావల్లభ! నిగ్రహాత్మకము సూ నీకూర్మి
రాధాధవా!

మ. చెలఁగన్ లాలనపాలనానుసరణా శ్లేషానుసంభాషణా,
దుల నీసన్నిధిఁ బాయఁబోక కృతకృత్యుల్ కా జనిం
గన్న వే, ల్పుల యా వ్రేతలెడందలన్ నెలవులం
బొల్పారునా బాలువె, న్నలతోఁ బాటు హరించి కాంచితి
మహానందమ్ము రాధాధవా!

మ. సలువౌ వేణువు రొండి, దాపలిబుజానన్ భక్ష్యచోష్యాది
సం, కలిత మ్మోదనశిక్యముం, గళ కయిన్, గాల్దోయి
నిన్ గజ్జియల్, జెలువారన్ యమునాధునీవనిని నోలిం
గాచి తీవాలమం, దల గోపాలురతోడఁ గూడి
త్రిజగత్కల్యాణ, రాధాధవా!

శా. ఆలోనీమహిమం గనం గుతుకియై యంభోజసంభూతుఁ
డ, య్యాలం బ్రేఁపుల గోపడింభకుల మాయంబుం
బొనర్పంగ నీ వాలోకించి ధరించి యత్తఱిన యాయా
రూపముల్ పల్లెలోఁ, బాళిం బుచ్చితి వత్సర మ్మొకఁ
డజప్రస్తుత్య, రాధాధవా!

మ. తనయాగమ్మున కడ్డువల్కి ధరణీధ్రశ్రేష్ఠముం గొల్చి
పా, ల్చినకిన్కం గురియింపఁ బొల్పడ సునాసీరుండు
జాల్వాన తా, దినముల్ మూఁడును నాల్గు, నుద్ధృత
ధరిత్రీధ్రుండవై ప్రోవవే, తనరం గూర్మి సగోగణమ్ము
వ్రజబృంద మ్మావు రాధాధవా!

మ. విష మాశీవిషజాతికుంట త్వదభిప్రేతంబ, యట్లయ్యు,
ని, ర్విషుఁ గావించితి కాళియాహి స్వజనాపేక్షీయమా
నార్కజా, విషముం బావనమాచరించుపనికై; స్వీయాను
రక్షం దటంకషమా నీకృప పక్షపాతికద భక్తస్వాంత,
రాధాధవా!

మ. చెలువై ముగ్గినచంద్రచంద్రికలచేఁ జిత్తమ్ము మొత్తమ్ము
మ్రు,చ్చిలికొంపోవు త్రియామలం దినసుతాశీతానిలా
నీతమా, జలబిందూత్కర మూడ్వఁ జెమ్మట నిషత్సా
రమ్ముఁ గ్రోలించుచున్, జలజాతాస్యల, లీలఁ **దేలితివి**
రాసక్రీడ రాధాధవా !

మ. కనఁ గంసక్రియమాణయాగమునకుం గైకొంచు ని
న్నేఁగు పా,వనుఁ డక్రూరునకుం గళిందతనుజావారిన్
నెఱిన్ **మీఱి చూపిన** యింద్రోపలనీలమై శ్రుతిశిరో
వేద్యంబునై పొల్చు నీ,ఘనరూపమ్మును గాంచి మించు
నెపు డీకన్దోయి రాధాధవా !

మ. అల నక్రూరపురోగతుండవయి, తాలాంకద్వితీయుం
డవై, జలదాభాపఘనుండవై, ఘనుఁడవై, సౌందర్య
వారాశివై, కలభంబుం బురుడించి మించు నడలన్
గంసుం గనంబోవు నీ,వలనుం గన్న మధుప్రజల్ సలిపి
రేభాగ్యంబు రాధాధవా !

మ. ఛలయాగాయతనమ్ము ద్వారమునఁ ద్వత్సంహారకర్మాతి
ని,శ్చలతన్ మావటివాని కానయిడి కంసస్థాపితమ్మౌ
మహా,జ్జలజాపీడము నాగమున్ సహాలివై శౌర్యం
బవార్యంబుగా, నిలఁ గూల్పం దొరకొన్న నీకు కెలనం
బింతింతె ? రాధాధవా !

మ. అవనీభారనివారకుండవు, స్వమాయాస్వీకృతానేక
మూ,ర్తివి సర్వస్థితినాశహేతువవు, గౌరీవల్లభాజప్రసం,
స్తవనీయుండ, వవార్యవీర్యుఁడవు, కంసప్రేరితుల్
ముష్టికా,దివిరోధుల్ కన నీకు లెక్కయొకో ప్రమందిం
పంగ రాధామాధవా!

మ. కినుకం దగ్గరి కొంగ సాళువముభంగిన్ గూలఁగాఁ
దన్ని ధా,రుణి, మాయింపఁగ నిన్ మదిం దలఁచు
క్రూరుం గంసునిం జంపి నీ,ఘనతేజమ్మునఁ జేర్చికొం
టివి కనంగానేర్తు కేరీతినేని నొనర్పన్ భవదీయ సం
స్మరణమ్మున్ నీప్రాపు రాధామాధవా!

మ. పరిహాసంబున, మచ్చరంబుకలిమిన్, వైరంబునన్,
గామత,త్పరతన్, నిర్మలభక్తియుక్తి, నెటు, లేషక్కిన్
భవన్నామసం,స్మరణవ్యాపృతి నేమఱంజనని యా
సత్పూరుషుల్ గాంత్రు సు,స్థిరతన్ ధామ మనంతమున్
భవపయోధిన్ దాఁటి రాధామాధవా!

మ. మతజాత్యాదివివక్ష, దీక్ష, నిధి, భామాపుంవిభేదంబు,
తె,న్ను, తమిస్రాదినకాలకల్పన, వయోన్యూనాధిక
త్వమ్ము నో,పతితోద్ధారక! భావనిర్ణయము త్వద్భ
వ్యాంఘ్రిపాథోరుహా,ద్వితయోపాస్తికి సున్న; యున్న
స్మృతియే వేయేల రాధామాధవా!

మ. పవిధారాహతికిన్ జలింపఁడు, నభస్వద్ధాటిఁ బాటింపఁ
బోఁడు, వికార మ్మొనయండు వహ్నిఁ గని, గోడుం
గాంచఁడున్ భాస్కర,చ్ఛవికిన్, భీతిలఁ డస్త్రశస్త్ర
తతికిన్ స్వాంతంబునన్ నీకుపా,దవనేజద్వయిఁ గొల్చి
పొల్చు త్రిజగద్వంద్యుండు రాధాధవా!

మ. హరి బ్రాహ్మమ్ముపదమ్ము, నింద్రపదవిన్, భూతేశ
ధామ, మ్మహ,స్కరధిష్ణ్యమ్ము, సమస్తలోకనికరేశ
త్వమ్ము, సర్వమ్మునున్, నిరతమ్మున్ దిలకించి తాఁ
దృణముకంటెం దేల్కగాఁ బొల్చు నీ,చరణాంభోరుహ
దత్తచిత్తుఁడు పరేశస్తుత్య, రాధాధవా!

మ. తెలియన్ రానిభవన్మహామహిమమున్ ధీగీష్పతుల్
వేదవే,త్తలకూర్మిం దెలియంగనైయితరచింతాదూరులై
త్వచ్ఛర,ణ్యులమై ని న్భజియించు సజ్జనులదా యోగ
మ్ముక్షేమమ్ము ని,మ్ముల నీవే వహియించికొందు కరు
ణాంభోరాశి, రాధాధవా!

మ. సమలోష్టాశ్మసువర్ణరత్నచయుఁ, డశ్రాంతార్జవోర్జస్వి,
ని,ర్మమతాహంకృతి, నిత్యతృప్తుఁడు, నిరారంభుండు,
నీరాగుఁడున్, క్షమి, యోగీంద్రుఁడు, సర్వభూతహితుఁ
డున్, సౌమ్యుండు, త్వయ్యర్పితా,త్మమనస్కుం డొక
రుండ నీకుఁ బ్రియుఁడున్ ధన్యుండు రాధాధవా!

మ. అతిఘోరమ్ము భవమ్ము పేరిటి తపార్కాంశ్వాగ్నిదుర్వా
రతా, వతితక్ దూరముసేయు నీదుననుకంపాసారమా
సారమం, దతిలిప్సక్ దడియంగ నేఱక యదీయస్వాంత
కేదారమం, దతులంబై దృఢభక్తిబీజము ప్రరోహ
మ్మెత్తు రాధాధవా!

మ. వలనుం, దేజము, నామరూపవిభవప్రాచుర్యముక్,
వీర్యముక్, గలిమిక్, శీలము, వాసముక్, గుణము,
లాకారప్రకారంబు, దో,ర్బలముక్, సర్వము తావక
మ్మెఱింగి యారాధించు ధన్యాత్ముం డుజ్జ్వలుండై
నీదగుకూర్మిపేర్మి నమృతత్వ మ్మొందు రాధాధవా!

మ. అల సరస్వతినాశకారణము, వేద్యంబుక్, సుగూఢంబు,
నీ,కలరూపుం దెలియంగ నేర్చి ముదముం గైకొన్నవా
రెన్న దేవలుండుక్, వ్యాసుండు, నారదుం, డసితుం
డుక్, వ్యాసాత్మజుం డాదిగాం,గల పుణ్యాత్ములు నల్వు
రేవుర కదా కంజాక్ష, రాధాధవా!

మ. నడువక్ నేర్తువు వేగ, పాదములు కానక్ రావు;
కావింతు నే,ర్పడరక్ గృత్యములన్ని, సున్న యనువౌ
హస్తమ్ము; లేనాండుం గ,న్పడరా, వెల్లెడ నిండియుం
దువు; ధ్వనిక్ స్వల్పం బనల్పంబయేం గడంకక్ విం
దువు, లేవు వీను, లకలంకా, నీవు రాధాధవా!

మ. అడుగుల్ సాచి తనంతఁ దాఁ గమఠ మాత్మాంగంబు
నందుం దుదిన్, ముడువం బొల్పడి పొల్చుమచ్చున
జగత్పుంజంబు గల్పింతు, తోఁడ్పడి పోషింతు, వడం
తు; వింతయును లీలం దేలఁగాఁగాదె, యానడకన్
జూపితి మున్ను కూర్మమయి యానందాత్మ రాధాధవా!

మ. అరయుంగా దిది కాదు కాదనుచు మూర్తామూర్తముల్
సర్వముల్, వరవాక్యమ్ములు ద్రోసిపుచ్చి చని చాలన్
దూర మచ్చో నహస్కరసాహస్రకరాతిగమ్ము కని
తేజఃపుంజమునుం బల్కె నీ పరతత్త్వం బది యంచు,
నొం దరయనోపంబోమి రాధాధవా!

మ. అలఘుం డిద్ధజగత్ప్రకాశకుఁడు తిగ్మాంశుం, డమర్త్య
క్షుధా కలనం దీర్చు సుధామయూఖుఁడును, నక్షత్రాళి
సౌదామినుల్, జ్వలనుండున్, దులలేని నీదుఘన తేజ
స్స్ఫూర్తి మోలన్ సముజ్జ్వలుఁ డాదిత్యుని చెంత దీప
కళికల్ సత్యంబు రాధాధవా!

మ. పణముల్ దుస్సహముల్ సెలంగి భవదవ్యాజస్వరూ
పాదిరూ, పణకార్యమ్ములకుం గడంగి యొగి వాక్స్వాం
తంబులున్ రెండుఁదా, మణుమాత్రమ్ముఁ ద్యజింపఁబో
కరసి పారావారాప్తిదూరమ్ములై, యణఁగన్ గర్వము
తొంటితెన్నుగొనె మాయాదూర, రాధాధవా!

మ. సమతాపాస్తము, సర్వహృత్కుహరవాసస్ఫీతము౯,
బూత, మతీమనోఽగోచర, మాదిబీజము, సుహృద్గే
యంబు, ధ్యేయంబు, భూతమహేశిత్వవిశిష్ట, మిష్టజన
తాతాపప్రణాశ, మ్మనంతము, వేదాంతవచోవి
మృగ్యము, భవత్తత్త్వంబు, రాధాధవా!

మ. ఎనయుం దారము రత్నహారములయం దేరీతి, నారీతి
తోఁప ననుస్యూతమ యయ్యు జాగరముఖావస్థా విశే
షంబులం, దనయంబంటక తానుపాధిఁ దగు నుద్యద్భక్తి
యోగీంద్రబృందనితాంతప్రణుతమ్మమై పరము నీ
తత్త్వమ్ము రాధాధవా!

మ. అవధిం గూర్చి స్వీయశిష్యులకు శ్రుత్యన్తార్థబోధావిధా
ప్రవణుల్ "సుమ్ము త్రయీతనూగతము తత్త్వమ్మేను;
నే నద్దియే, యన్యము౯ నిక్క" మటంచు మించు శ్రుతి
వాక్యాళిం బ్రబోధించుచుం, ద్రవధానమ్మన నీవు
తత్త్వము సుగోప్య మ్మెప్డు రాధాధవా!

మ. అగవీమానసగోచర, మ్మనుపమ, మ్మజ్ఞాత, మత్యుజ్జ్వల
మ్మగుణ, మ్మాద్య, మనాదిమధ్యనిధన, మ్మద్వైత,
మాదిత్యమధ్యగ, మవ్యాహత, మాదిభూత, మఖిలా
ధార, మ్మనాధార, మాశుగ, మస్థానము, నీదుతత్త్వ
మరయ౯ శుద్ధంబు రాధాధవా!

మ. తనరం గోరికి కూర్చి ఖాద్యమవు నేతద్విశ్వవిశ్వంబు,
నొ,య్యన నద్దాన ననుప్రవిష్టమయి కోశాఖ్యాన
మౌనూక డా,గిననీత త్త్వము యుక్తిఘాతనుల వెల్కిం
దీసి యాసింత్రు తా,గ్గోన బియ్యమ్మటు లాగమజ్ఞులు
బృహద్రూపాథ్య, రాథాధవా!

శా. నీత త్త్వమ్ముభయమ్ముకల్మి ననుచుఁ నీ రేజమిత్రుండు,
నా,శీతాంశుండును; మండు నగ్గి; వడి వర్షించుం బయో
దంబులుఁ; వాతం బాగక వీచుచుండు; మెఱయుఁ
నక్షత్రముల్; పాఱుఁ బా,రాత్రికాంతియు లేక తోయధు
లమేయస్థైర్య, రాథాధవా!

మ. విషమంబుల్ విషయార్థపద్ధతుల సుస్వేచ్ఛాగతిం బాఱు
దు,ర్విషయాక్షంబుల పేరి వారువములఁ వేగఁ నివా
రించి పూ,రుషపంచాస్యులు కట్టివైతురు మనోరూపమ్ము
పాశమ్మునఁ, విషమాక్షోర్చ్యము త త్త్వశంకువునఁ
బూన్కిం బట్టి రాథాధవా!

మ. అమలమ్మున, మలనాశకమ్ము, పరముఁ, సాకార,
మాకారశూ,న్యము, దూరస్థ, మదూరసంస్థము, ఘన,
మ్మజ్ఞేయమ్ముఁ, జ్ఞేయ, మా,ద్యము, సూక్ష్మమ్ము,
నసూక్ష్మ, ముచ్ఛ్రితము, విశ్వాంతస్థమ్ముం, దద్విభి,
న్నము త త్త్వమ్ము నెఱుంగువార లభవుల్ నాగార్చ్యభ్యా,
రాథాధవా!

మ. తెలియన్నేరిచి యద్వితీయమవు నీదివ్యమ్ము తత్త్వమ్ము
వ, త్తిలుభవ్యాత్ముఁ డెవేళ నేఁ జలువ నేదేకార్యమున్
దత్ఫలం,బులు పాపంబులు పుణ్యముల్ పెరుకఁబోవున్
వానిలోమమ్మ, యి,మ్ముల లేకున్కిని గర్త్రభోక్త్రల
మతియే భూమాఖ్య, రాధాధవా!

మ. పరమ, మ్మాద్యము, చిద్ఘన, మ్మమలమా బ్రహ్మ
మ్మదొక్కండ భా,స్వరతన్ విశ్వతనుత్వయుక్తిఁ బర
రూపప్రస్ఫురితిన్ శుక్తిమా,దిరి నజ్ఞత్వసమావృతమ్మయి
కనున్; దీపింపఁ దజ్జ్ఞానమే, స్థిరమై క్రాలును విశ్వమ
ప్యయము, తచ్ఛేషమ్ము రాధాధవా!

మ. కలలం గన్నుల కగ్గమై సమయు మేఘంబుల్, తటిత్తుల్,
పయో,ధు, లిభంబుల్, పుటభేదనంబులు, జగత్తుల్
జాతముల్, జీవనంబులు, గేహంబులు, పుత్త్రమిత్త్రులు,
ధనంబుల్, ధాన్యముల్, నిక్క; ము,జ్జ్వల మద్వైతమ్ము,
శాశ్వతమ్ము పరతత్త్వమ్మొండె రాధాధవా!

మ. నిను నవ్యాకృతు, నామహీను, నమలున్, నీరూపునిన్,
జ్ఞానరూ,పునిగాఁ దెల్పిన వేదవాక్య మదియే పొల్పా
రగాఁ దెల్పిపొ,ల్చు ననేకాంఘ్రికరోరుము స్తకవిభాసున్,
భాసురాంగున్, గన,ద్వనమాలాన్వితుఁగాఁగఁ గాం
చదో విరుద్ధత్వంబు రాధాధవా!

మ. వనమాలాధరు, శంఖచక్రయుతు, శ్రీవత్సాంకునిఁ,
గంబుకంఠునిఁ, బీతాంబరు, శంబరాంతకసమానుఁ,
మానినీమోహనుఁ, వనజాతాక్షు స్వపక్షరక్షణచణుఁ
భావించి కీర్తించు సజ్జను లొందంగలవారవారిఁ
బరమైశ్వర్యంబు రాధాధవా !

మ. భువి నుత్తుంగతరంగభంగతరళంబుల్ భోగముల్
భాగ్యముల్, పవనోద్ధూతశతాంగ కేతుపటలోలంబుల్
శరీరంబు, లశ్లవుటం దామ యెఱింగియు న్వీనియు
నేలా మూఢులై కాంచఁబోరు విరక్తిఁ సదు లాజ
వంజవసుదూరుల్ కాఁగ రాధాధవా !

మ. తనరం బ్రాగ్గిరిస్వస్తికావదముమధ్యం గ్రాలువేశం
ద్రయీ తనుఁ డింటఁ సమపక్వ మోగిరమ యాతం
డ స్త శైలంబుదా, పునకుం బోయెడునంతలోఁ జెడున్,
తత్పుష్టంబు దేహంబు నిల్చు నెటుల్ శాశ్వతమై ?
జనుల్ తలఁప రీచొప్పెప్డు రాధాధవా !

మ. చనుపై సర్వేషు నట్టిలోఁగొనెడు దుస్సాలావృక ప్రాయ
లం గనలఁ సమ్మి సత మ్మవారికులుకుం గాఁగిళ్ల పేరింటి
చిచ్చువ భ్రష్టాత్ముఁడు కాలఁ గాయ మటు చచ్చుం
గాని కార్చిచ్చుఁబోలిన సంసారము నార్పు నీపదము
జోలిం బోఁడు రాధాధవా !

మ. స్థిరతాదూరము, మాంసశోణితయకృత్స్వేదప్రదుష్టంబు
దు,ర్భరముఁ, హేయము, కాయముం బెరసి మర్త్య
వ్రాత మేలా సుదు,స్తరసంసారసముద్రతారక,
మసత్తాపప్రణాశంబు, సు,స్థిరమౌ కర్జము కూళ్లై
చనదు సాధింపంగ రాధాధవా!

మ. నివసింపఁ గిరికందరంబు, లభిమానింపఁ మృగవ్రాత
ముల్, పవళింపఁ సమముల్ దృషత్తులు, భుజింపం
గందమూలంబు, లా,న విశుద్ధంబు ఝురాంబు, వృత్తి-
కయి కాంతారంబులుఁ లేవొకో, భువి నేలా గృహ
కూపమందుఁ బడి బాముల్ గాంచ రాధాధవా!

మ. భవకాంతారముమధ్యమందు స్వపరీవారప్రలాపంబు పే
ర్దవువ్యాధాగ్ర్యననూనగానవిధిచే నాకృష్టచిత్తమ్ము
నఁ, జవ మొప్పం జని రాగవాగురి విలగ్నంబై
మృతిం గాంచు ది,క్కెవరుఁ లేమి నెచోట మర్త్య
మృగ మెంతేఁ, గుంది రాధాధవా!

మ. పరఁగఁ మత్తిలి మోహనామకసురాపానంబునఁ,
లోలుఁడై, తరుణీభూతగృహీతుఁడై, సుతసుతాతండాళి
సందష్టుఁడై, సరణోర్వీరుహ మెక్కి- దుర్విషయసంజ్ఞ
మైన శాఖాతతిఁ, దిరుగంబూనిన మానుషప్లవగుఁ
డార్తిం గూలు రాధాధవా!

మ. హారి మత్తాంధతమమ్ము క్రమ్మి నయనమ్ముల్ కానరా
కేడ్చున, త్తరిఁ గామాదిరిపుల్ వివేకమనువిత్తమ్మెల్లఁ
గొంపోవ వం,దురుచుర్ మూఢుఁడు పోయి పోయి
యటు లెందో కూలు సంసారభీ,కరకూపమ్మునఁ, గాని
ముక్తిపథముం గానండు రాధాధవా!

మ. చరణద్వంద్వము నెత్తి నెత్తివయిఁ దాచం బూనినన్
మానఁబో,నరిలిన్ మోహపుత్రాటఁగట్టువడి పాయం
బోక వెన్నాడు చే,పర స్త్రీ పేరిటియాడుగాడిదకు లోనై
గోడులం గుడ్చుని,న్నురబాలేయము కాంచ నేరుచునె
ధన్యత్వమ్ము రాధాధవా!

మ. క్షమ జన్మించిననాఁడునాఁగఁ బ్రబలాశాపీడితుండై
యజ,స్రము నత్యల్పణకల్పిపాచరణదీక్షాదక్షతన్ బూ
రుషా,ర్థము లగ్గింబడఁద్రోసి వీసము నసారంబైన సం
సారమం,దు మమత్వం బెడఁబాయఁబోని జనుఁ డొం
దుం జేటు రాధాధవా!

మ. హారిఁ గుక్షింభరణాత్తచిత్తమున రేపున్ మాపునందందు
సం,చరణ మ్మాచరియించి డస్సి యిలుపంచం జేరుచో
నొక్క,మా,ర్గరువన్ నందనదందశూకములు పెన్కస్తిం
బడంబూనుఁగా,క రవం తేని విరక్తి నల్పుఁ డెవ్వడుం
గాంచండు రాధాధవా!

మ. సరవిఁ గ్రొవ్వదరపూరణాభిరతి నష్టభ్రష్టుఁడై కష్టముల్,
వెరయంగానయి పారమార్థికముఁ జోలింబోక రాకాసియై
స్థిర మైఁ దాల్చినలాభ మింత కనునే శింఘాణభుక్తిన్
నిజో,దరముం నింపుచు మేను వెంచి మనదే ధ్యాంక్షంబు రాధాధవా!

మ. ధరణిన్ దుర్లభమైన మానుషజనిన్ దాఁ గాంచి
చంచద్గతిన్, బురుషుండై కలజ్ఞానవైభవము వమ్ముం
జేసి నిత్యమ్ముఁ గా,సరమట్టుల్ చరియించు చన్నిటఁ
బ్రణాశమ్మందుమందుండు నీ,చరణంబుల్ శరణొందఁ
బోక యెటు మోక్షమ్మందు రాధాధవా!

మ. తెలియంజాలమి బాలభావమున, విద్దెల్ నేర్వ నాపైని,
నా,వల బిబ్బోకవతీవిలోలతను, నాపై సంసృతి న్మన్కి
నిన్, దలఁపంబోక కృతాంతకాసరగళోద్ఘంటానినా
దంబు తన్, కలఁతంబెట్టుతఱిం దొలంకొను నె
మ్మొక్కుం గూళ రాధాధవా!

మ. ఒకవంకం బవనాతిపిత్తగతి, శ్లేష్మోద్రేకవాగ్రోధ, మిం
కొకవంకన్ దనుజాదిరోదనరవ, మ్మొండొక్కచక్కిన్
గృతాంతకభృత్యోఘముతర్జనమ్ము లడరం దా నట్టిచో
నీల్గున, క్షోకయింతేని లభించునే యదను ని న్నూహింప రాధాధవా!

మ. గలసీమం దమభీమపాశములఁ గిన్కన్ గ్రుచ్చి బంధించి
యా,ర్పులతోఁ బాశిభటాళి ప్రాణపవనంబుం దీయు
చున్నప్డు, తో,య్యాలి పైనింబడి యాస్త్రిప్రాస్తులకు
హాహారావముల్ సేయున, ప్డలఁతుల్ గొల్వఁగలారె
నీదుమృదుపాదాబ్జంబు రాధాధవా!

మ. వెనువెంటంబడి రా నపారము మదావేశమ్మునం దా
మొన,ర్చినదుష్కర్మఫలమ్ము క్రమ్ముకొనుచున్ బ్రేతా
ధిరాడ్ధామ మొ,య్యనఁ జేరంజని మర్త్యు లాడఁ గను
నాయానారకమ్ముల్ దలం,చిన భీతిం బ్రిదులంగఁబో
దెవనిదాచి త్తమ్ము రాధాధవా!

మ. మును తాఁ బెట్టినహింసఁ గన్న నిఖిలంబుల్ జీవముల్
తీర్చికో, ఘనవైరమ్ము కరాళవృత్తి నచటం గాల్చెట్టుచే
హద్దుగా, ననువౌ చేష్టలఁ జుట్టుముట్టి యొకకై యం
గంబులం జీల్చునప్డు నరుల్ గాంచెదుగోడ్పుఁ జూడ
నెవఁ డోపుం గంట రాధాధవా!

మ. అలుకన్ మత్తిలి కాలకింకరులు హస్తాంఘ్రిద్వయ
మ్మంటగ,ట్టి లలిన్ దెల్పుచుఁ బూర్వకర్మములు వీటిం
దాఁటి బాహ్యస్థలిన్ శిలపై నంజుకుకంపులీను నెడ మేన్
భిన్నమ్ము భిన్నమ్ముగాఁ, జలుపం బొల్పడఁ గల్గుకస్తిఁ
గలరే సైపంగ రాధాధవా!

మ. నెనరుం బూనక యింత యంతకభటుల్ నిర్వేలహా
ర్షంబు మై,కొన మైకట్టెలమంటఁ గాచిన యయోఘో
రమ్ము భాండాంతర,మ్మునఁ బెఁగ్రిందవు తైలమందు
వడియమ్ముల్ వ్రాలె వేయించువే,ళ నరుల్ పాపులు
గాంచుతాప మది యల్పం బౌనె రాధాధవా!

మ. తలక్రిందౌనటు లేర్వ భూగతబృహద్భాన్వర్చ్చు లం
గమ్ము ద్యో,తలముం దాకెడు ద్రుమానీకొమ్మలకుఁ బాద
ద్వంద్వముం గట్టి ము,ల్కు లవారల్ మెయి చిల్లువ్రా
విడచుచోఁ గుద్వంగనా గోరముల్, గలనైనం బగ
వారికేనిఁ గలుగంగానీకు రాధాధవా!

మ. మలమూత్రాదికసంకుల, మ్మసమ, మస్మార్య, మ్మవా
ర్యమ్ము, పు,ర్వుల కిర్వైన చనుసంధకూపమునఁ దద్భ
క్తిన్ లయంబంద వా,రలచేఁ బాతితుఁడైన మానిసి
సహస్రంబుల్ సమల్ దాఁక దు,ర్బలతం బొందు బెడంద
లెన్నఁడుఁ గృపన్ రానీకు రాధాధవా!

శా. ఎన్నే నేడులు పాశిలోకమున నెన్నే తెన్నుల న్నారకా,
లెన్నే నొందిన నొందవచ్చు, నవు నెంతేఁ గుందినన్
గుంద నా,పన్నుండై, కనరా దేవాఁడు నెపుడున్
స్వప్నంబునంగాని, య,న్ననా! గర్భము పేరినారక
మసహ్యమ్మెన్న రాధాధవా!

మ. తెరువుం గానక వెల్వడన్, మడివడన్ దేహంబు
సర్వాం, బధఃశిర మొప్పారఁగ, స్నాయుబద్ధుఁడయి,
పెన్జిల్లుల్లాడంగా నొడల్ గరువం బాల్పడఁ బెంటనున్న
పురుషుల్, కన్దోయి నీర్నింప, దుర్భరగర్భమ్మున బ్రుగ్గి
బ్రుగ్గఁ దనుభృద్వ్రాతంబు రాధాధవా!

మ. తమిమై గర్భముఁ దాల్చి పొల్చు చలి యేదం దిన్న
యాయాపదార్థములం గల్గిన యుష్ణాకారములసంతాప
మ్మొనన్ మేను భగ్నమనన్ సైపఁగలేక యేకరణిఁ
జేకూరున్ వెలిఁగాంచుటం, చు మదిం గొందలమందు
నిచ్చలతఁ డేప్పుం బెల్లు రాధాధవా!

మ. తిపురన్ మాసము లొక్కఁ డెన్మిదియుఁ బూర్తిం జెంది
తత్రత్యవాత్యావిధిన్ వెల్వడి వాఁడు మూర్ఛఁ గని
మాయన్ జ్ఞానసంపత్తి కూడి వడిం బోసిన నీటివేడి
మిని దెల్వొంగాంచి బిట్టేడ్చు నిట్టివిధిం గూర్చితె దేవ!
యంచు వగ రెట్టింపంగ రాధాధవా!

మ. చినుఁగుంబొత్తులఁ గూలనైవఁబడి స్త్రీచేఁ గుక్కుమం
చాన మత్కుణముల్ చీమలు దోమలుం గొఱుకఁ
జేతుల్ రామి వారింప వాఁకొనుభాగ్యమ్మును లేమి
నార్తిఁ గను వాక్రోనిచందమ్మునం, దనదా భావి
విధంబు దెల్పుగతి దైన్య మ్మొప్ప రాధాధవా!

మ. సమవాతావరణమ్ముఁ గల్మి, ననరిష్టప్రాప్తి జీవమ్ముఁ
దాల్చి, మహాభాగ్యము గల్గుచోఁ దనదురోజుంబుచ్చు
చుఁ బీట బాల్యము నజ్ఞానముపేర్మి దాఁటి యవలన్
లభ్యంబ యానట్టి చంద్రమునన్ నేరుచు విద్దె, లేని
యెడ శూన్య మ్మది రాధామాధవా !

మ. ఏడసూవన్ నవయౌవనాంకురము లంభోజాక్షి
నొక్కర్తుఁ దోడ్పడఁ గొంచున్ ననవింటివాని పెను
చివ్వన్ ముగ్గి యా తెన్నునన్, గఠువన్ గొన్నిసమల్
శమింప నవుటం గాయంబునం బల్మి మై ముదుతల్వాగ
నవాఁకు వార్ధకపుకంపుం జెందు రాధామాధవా !

మ. బలవద్వ్యాధిపరీత దేహుఁడయి దుర్వారమ్ము శోకమ్ము
నన్, విలపింపందొడరన్ సతీసుతులు మేన్ వే పీడి
యాయామాఫలంబులు పాపాదులకున్ భుజించి మఱలన్
బుట్టున్ భువిన్ గిట్టు నిట్టులు సంసారముచక్రమందుఁ
బడుఁ బాటుల్ దేహి రాధామాధవా !

మ. తెలియన్నేరిచిఘోరసంసృతిమహార్తిస్ఫూర్తి నశ్రాంత
మున్ జలజాతోద్భవ శైలజాధవ సురేట్సంపూజ్యమై
ప్రాజ్యము, క్లిలతాంగీ మృదుహస్తసంగ్రహణ మర్థిం
గూర్చు నీపాదసేవ లలిన్ సంసృతి దాఁటువారు ఘను
లబ్జాక్షా రాధామాధవా !

మ. భవచక్ర క్రకచావిదీర్ణ, మురుతాపజ్వాలసంతప్తముౕ,
వివిధాధివ్యధితమ్ము, మోహమదనిర్వేలమ్ము, లోల,
మ్మఘూ,త్యవధానమ్ము, విపన్నముం, ద్వదురుమాయా
ఢాకినీమర్దిత, మ్మవు లోక మ్మఖిలమ్ము బ్రోవు మనుకం
పాంభోధి, రాధాధవా !

మ. శ్రవణీయస్వచరిత్ర, ధాతృదివిజేంద్రత్ర్యమ్బక ప్రధవరాత్మ
జా,ధవసంస్తోత్రవిధానపాత్ర, కలుషధ్వాంతాబ్జమిత్రా,
మహా,ద్భవపాథోనిధియానపాత్ర,నవవార్వాహోల్లసద్గా
త్ర, దా,నవరాడ్వంశలతాలవిత్ర, కొనుమా నాజోత
రాధాధవా !

* * *

మ. కలిఁ గంజప్రభవుల్, గుణమ్ములును, మేఘద్వార
బాణమ్ములౕ, నలువౌ నీబహుధాన్యవర్షముతఁౕ
సవ్యస్థితిం గ్నప్త మిద్ధ లలిౕ బ్రీతిసమేతుఁడై చదువ
భక్తిజ్ఞానవైరాగ్యసిద్ధుల నొస్పారును బూనుచుండు
త్రిదశస్తోమార్చ్య, రాధాధవా !

* * *

స మా ప్త ము.

## ఈ రచయితల మఱికొన్ని పుస్తకములు:

అచ్చయినవి

౧ ప్రణయగీతాలు
౨ పుష్పమాల (ఖండకావ్యము)
౩ పుష్పబాణవిలాసము (అనువాదము)
౪ బాష్పకణములు (దేశీయనాయకస్మృతి)
౫ ఆత్మత్యాగి (జతీంద్రదాసు జీవితము. ప్రస్తుతము అచ్చులోలేదు)
౬ కవురిగిలి (ద్విపద. ప్రేమకథ)
౭ శ్రీమద్భాగవత మాహాత్మ్యము (౪ ఆశ్వాసములు)
౮ శ్రీ దయానందతిమిరభాస్కరము (ప్రథమభాగము) (సత్యార్థ ప్రకాశ ఖండనము)

అచ్చుకానున్నవి

౧ శ్రీ దయానందతిమిరభాస్కరము (౩ భాగములు)
౨ పరకాయప్రవేశము (౩ ఆశ్వాసములు)
౩ కాలభాగవతము (ద్వితీయస్కంధము)
౪ ఆంధ్రప్రతిభ (ఖండకావ్యము)
౫ భద్రావత్యభ్యుదయము (హాస్యప్రబంధము)
౬ గణేశపురాణము
౭ దయానందమిథ్యార్థప్రకాశము
౮ పురాణములు
౯ శ్రీ వైకుంఠనాథ స్తవః
౧౦ శ్రీ రామలింగేశ్వర స్తవః
౧౧ శ్రీ శివవింశతి